కాదు. నేను మతీయొకనికి గొఱ్ఱెలకాపరిని. నాయజమానుఁడు కడుం గోపస్వభావుఁడు. పరోపకారాదిధర్మాచరణమువలనఁ బరలోకసౌఖ్యమును గోరుసంతటి ప్రాజ్ఞుఁడు గాఁడు. ఇంతియకాక వానికుటీరంబులును, గొఱ్ఱెలమందలును, బచ్చికబయళ్లును విక్రయింప సిద్ధముగా నున్నాఁడు. మాయజమానుఁ డిచ్చట లేమింజేసి గొఱ్ఱెలసాలయందు మీరు తినఁదగు తినుబండారము లెవ్వియును లేవు. కాని నాస్థితిగతులకుం దగినయల్పాహారము నొసంగెదను లోనికి దయచేసి కలిగినదానితోఁ దృప్తినందుఁడు.

వసం—నీయజమానుని మందలును, బచ్చికబయళులును, గుటీరములుం గొనఁదలఁచినవా రెవ్వరు ?

అంగ—ఒక్కనిమిషమువెనుక మీరిచ్చట నాతో మాటలాడుచుండఁగాఁ జూచిన యాటవికుఁడే. ఆతఁడు కొనుటయం దంతశ్రద్ధఁ బూనువాఁడు కాఁడు.

వసం—వాని కట్టిగట్టిపూనిక లేనియెడల మనము కొనఁదలఁచినను మర్యాదాభంగము కాదు గావున మానిమిత్తమై వానిసర్వస్వమును గొనుము. క్రయధనమును మేమిచ్చెదము.

శుక—మేము నీకు వేతన మభివృద్ధి గావించెదము. నా కీప్రదేశము గడురమ్యముగానున్నది. ఇందుఁ గాలయాపనము సేయ నిచ్చగించుచుంటిని.

అంగ—నిశ్చయముగ విక్రయమునకు సిద్ధముగా నున్నవి. మీరు నాతనేతెంచి యీభూములు సారవంతము లనితోఁచు నెడలను, భూములవలయాదాయము మీరిచ్చు క్రయధనంబునకు సర్హమని సచ్చినయెడలను, మీప్రదేశములు నివాసయోగ్యములుగా నున్నయెడలను, మీయొద్దనుండ క్రయధనముం గొంపోయి వానిని మీయధీనముం జేయుదును. నేను విశ్వాసవంతుఁడనై మీమందలం గాంచుచుందును.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

## 5-వ రంగము.

### అడవి.

(ఆనందుఁడు, ప్రియంవదుఁడు, మఱికొందఱుం బ్రవేశింతురు.)

ఆనం — గీ. శ్యామలపలాశభూరుహచ్ఛాయలందుఁ
గలసినాతోఁ బరుండి పక్షులకలస్వ
రములతోఁ గవకల్పి గీతములుపాడ
నిచ్చగలదేని రండు రం డెవ్వరైన
శిశిరకాలంబు దుర్భరశీతవాత
ములును దక్కంగ వేఱువైరు లిటలేరు.

ప్రియం — ఏదీ! ఇంకను. ఇంకను. ఇంకను.

ఆనం — ఓయీ ప్రియంవదుఁడా! నీకీపాటవలన విచారమును గలిగించిన వాఁడ నగుదును.

ప్రియం — అట్లయిన నాకు సమ్మతము. దయచేసి యింకను. ఇంకను. గ్రుడ్లను బుక్కిటఁబెట్టి సర్పము వా రసముం బీల్చినటులు నీగానమునుండి విచారము నాకర్షింపఁగలను. దయచేసి యింకను, ఇంకను.

ఆనం — నాకంఠము జీరవోయినది. నేను మీకానందమును గలుగఁజేయఁజాలను.

ప్రియం — నాకానందమును గలిగింపు మని కోరుటలేదు. గానముచేయు మని కోరుచుంటిని. ఏదీ, యింకొకగీతము పాడుము. మీరు వీనిని గీతము లనియే పిలిచెదరా?

ఆనం — అయ్యా! ప్రియంవదుఁడా! మీ రెట్లు పిలిచిన నట్లే యగును.

ప్రియం — వానిపేరులు నేను లెక్కసేయను. అవి యేవియు నాకునచ్చియుండ లేదు. నీవు పాడెదవా?

ఆనం — నాసంతోషముకొఱకుఁ గాదుగాని మీకోరికిం జెల్లించుటకే.

ప్రియం—అట్లయిన బాగుగ నేయున్నది. నే నెప్పుడయిన నెవ్వరికయినం గృతజ్ఞతం బలుకు నెడల నీకునుం బల్కెదను. ఒకరినొకరు స్తుతియుక్తములైన ప్రత్యుత్తరములం జేయుచున్నం జూచి నాకు, రెండు వేటకుక్కలు చేరి పోరాడుచున్నట్లు కాన్పించును. నన్నెవ్వరేని విశేషముగా శ్లాఘింతురేని యర్థార్థులై పొగడు వందిమాగధుల పొగడ్తగా నెంచెదను. ఇంకం బాడుము. (ఇతరులవంకం జూచి) గానము సేయునిమీరు నిశ్శబ్దముగా నుండుండు.

ఆనం—మంచిది. నేను గీతమును ముగించెదను. అయ్యలారా! మీరు భోజనమునకై పీటల నమర్చి భోజనపాత్రల నాసాదించుచుండుండు. రాజుగారీచెట్టు క్రిందనే ఫలహారము గావించెదరు. (సుఖాసు్య నుద్దేశించి) మహారాజుగా నాండు నిన్నుం జూడం దిరుగుచుండిరి.

ప్రియం—ఈదినమంతయు వారికంటం బడకుండుటకుం బ్రయత్నించుచుటిని. ఏలయన, ఆయన వాదశీలుండు. నా కది సరిపడదు. ఆయన ప్రకృతియం దెన్నివిషయములం గూర్చి విమర్శించునో నేనును నన్నివిషయములం గూర్చి విమర్శించువాండనే. కాని యట్టివానిం గూర్చి డంబములు చెప్పుకొనక భగవంతునికిం గృతజ్ఞుండనై యుండెదను. సరదే. ఇంక నుపక్రమింపుము.

ఆనం — గీ. అంతరాసట్టి కోర్కెల సంప పోయి
పడెడువారును దపనాతపమున కింత
వెఱపులేక యెడారులం దిరిగి భుక్తి
కై మృగంబుల వేటాడి యలయువారు
విధివిహితభోజంతతులం దృప్తింగనువారు
నిలను గలరేని యందరం డెవ్వండైన
శిశిరకాలంబు దుఃఖితవాత
ములను దక్కంగ వేఱువైరు లిట లేరు. 20

ప్రియం — నాకవితాప్రాగల్భ్యమునకు సిగ్గుగలుగునటులు నిన్న నేనుగూర్చిన యొకగీతము నిచ్చెదను.

ఆనం — దాని నీవు చెప్పుము. నేను సరిగాఁ బాడెదను.

ప్రియం — అది యిట్లుండును.

ఉత్సాహ. నరుండు పట్టువట్టు నెమ్మనంబు దృష్టిగొల్పఁగా
ధరన్ ధనంబు సౌఖ్యమున్ విసర్చి యెవ్వఁడైనను
ఖరంబుగాఁగ మారి స్వేచ్ఛగాఁ జరించెనేని వాఁ
డరుంగరంబునాత్మతుల్యులైనబుద్ధిహీనులం
దిరంబుగా నిటం గనుం దధిం దధిం దధిం దధిం. 30



ఆనం — అయ్యో! ఆతకధీం, ఏమిటి?

ప్రియం — ఇది గీర్వాణమున బు హీనుల నాకర్షించుమంత్రము. ఇఁకఁ బోయి నిద్రపట్టినఁ బండుకొనియెదను. లేదేని దక్షిణతీరమందలి లంకావాసుల నందఱను దిట్టిపోయుదును.

ఆనం — ఇచ్చట ఫలాహారసంభార మంతయు సంసిద్ధమైనది. కావున నేనేగి రాజుగారిని బిలిచికొనివచ్చెదను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

## 6-వ రంగము.

## అరణ్యము.

(భీమబలుఁడు, సుమంతుఁడు, ప్రవేశించుచున్నారు.)

సుమం — ప్రియమైనయజమానుఁడా! నేనిఁకముందు నడువఁజాలను. ఆఁకలిచే నాప్రాణములు పోవుచున్నవి. నే నిచ్చటఁ బరుండి నాసమాధికి వలయుస్థలముం గొలిచెదను. దయామయా! నీకు శుభమగునుగాక!

భీమ—ఏమది సుమంతా! ఇప్పు డెట్లున్నది? నీహృదయంబున నించుకంతయు గాంభీర్యము లేదా? కొంచె మోపికవట్టుము. కొంచె మూఱడిల్లుము; కొంచెము సేపు ప్రాణములు నిలుపుకొనుము. అగమ్యగోచర మగునీయర ణ్యమున నెద్దియైన మృగముండిన దానిని నీకాహారముగఁ గొనితెచ్చెదను. లేదా దానికి నాదేహము నాహారముగా నిచ్చెదను. నీదేహబలముకంటె మనోవికారమే మరణము నెక్కుడుగా సమీపించుచున్నది. నాకొఱకై నను గొంచెము విశ్రాంతినొందుము. మృత్యుదేవతను గొంచెముసే పాక బారెఁడుదూరమున నిలుపుము. నేనిప్పుడ మరలి వచ్చెదను. నీకేదేని యాహారముం దేఁజాలనిచో నీవు మృతినొందుటకు సెలవొసంగెదను. కాని నేను రాకమున్నె నీవు మరణించినచో నాశ్రమను బరిహసించి వాఁడ వగుదువు. (సుమంతుఁడు ముఖవికాసముఁ జూపుచున్నాఁడు. బాగుగానున్నది. నీవు కొంచెము ధైర్య మవలంబించినవాఁడవు గాఁ న్పించుచున్నావు. త్వరితముగా మరలివచ్చెదను. కాని నీవిచ్చటఁ జలి గాలిలో నుంటివి. నిన్నెచ్చటకైనను మఱుఁగునకుం గొంపోయెదను. ఈ విపినమం దె ద్దైన జీవజంతు వుండినచో నీవాహారములేక మృతినొం దవు. ధైర్యమవలంబించి నిశ్చలముగ నుండుము.

(వృద్ధునితో నిష్క్రమించుచున్నాఁడు.)

## 7-వ రంగము.

## అరణ్యము.

భోజనపాత్రము లమర్పఁబడియుండును, సింహకేతుఁడు, ఆనం దుఁడు, సామంతులు, ఆటవికవేషముసఁ బ్రవేశింతురు.)

సింహ—ప్రియవయస్యుఁ డరణ్యమృగముగ మాఱి యుండెనోపు. ఎచ్చట నాకఁ డొకమనుష్యునివలెఁ గాన్పించుటలేదు.

౧. సామం — ఓయేలికా! ఇప్పుడే యిచ్చటనుండి వెళ్లియున్నాఁడు. ఇచ్చట నున్నపు డొకగీతమును వించు నానందించుచుండెను.

సింహ — గుణములచే నైకమత్యములేని యీతఁడు, స్వరములచే నైకమత్యము గలసంగీతముచే నానందించె నేని యైకమత్యప్రధాన మయినగ్రహసముదాయమునకుంగూడఁ బార్థక్యము సంభవించును. నే నతనితో ముచ్చటించుట కభిలాషముతో నుంటి నని చెప్పి తీసికొని రండు. (ప్రియంవదుఁడు ప్రవేశించును.)

౧. సామం — ఆతఁ డిచ్చటకే వచ్చుచుండుటచే నాశ్రమ నివారణమైనది.

సింహ — ఓహో! ఏమిది! దుఃఖాస్యుఁడా! నీజీవితచరిత్ర చిత్రముగా నున్నది. నీబీదస్నేహితులను నీసమావేశంబున కుఱ్ఱాఁతలూఁగువారినిగాఁ జేయుచుంటివి. నీవేమో యానందభరితునివలెఁ గాన్పించుచున్నావు.

ప్రియం — ఊ. నేఁడు విదూషకుం డలవనింగనిపించె వికారరూపమై
వేడుకఁగొల్పు వస్త్రములఁ బ్రీతి ధరించి ధరాతలంబుపై
వేఁడిమి మించు నెండపొడ వెన్నెలరీతిఁ బరుండి యుండి, తా
వేఁడుచునుండె నయ్యెడ నవీనమ్ముదూక్తుల భాగ్యదేవతన్.

విదూషకుఁడా! నీకు నమస్కార మని నేనంటిని. అందుకువాఁడు — అట్లు కాదు. దేవుఁడు నాకు భాగ్యము నను గ్రహించువఱకును నన్ను వి— దూషకుఁ డనిపిలువకుము. అనియెను. పిమ్మటఁ దన జేబునుండి యొకగడియారపుబిళ్ల దీసి కాంతివిహీనమైన దృక్కులతో దానిం జూచి జ్ఞానయుక్తముగా నిట్లనియెను. ఇప్పుడు పదిగంటలైనది. దీనివలనఁ బ్రపంచ మెట్లునడచుచున్నదో మనము కనిపెట్టవచ్చును.

గీ. గంటక్రిందటఁ దొమ్మిదిగంట లయ్యె
గంటమీఁదఁ బదునొకండు గంటలగును
గంటగంటకు వృద్ధియై గ్రాలి పిదప
గంటగంటకు క్షీణించి గడతు మనని.

ధానము మంగళగిరిగాలిగోపురమువలె స్పష్టముగాఁ గానఁబడుచున్నది. నాచేఁ బరిహసింపఁబడిన యెవ్వఁడయిన నాపరిహాసమువలన నైనపరాభవము గ్రహించియుఁ దన్నుఁ గానట్టు నటింపవలయునే గాని పోరాటమునకు సమకట్టునెడల వాఁడు కడు బుద్ధిహీనుఁడై పరిగణింపఁబడును. అట్లు కానియెడల విలాసమాత్రమున నాడినపరిహాసవాక్యములఁగూడఁ దమయం దారోపించుకొని బుద్ధిమంతులుగూడ హాస్యాస్పద మగుదురు. ఇంక నాకు విదూషకనైపథ్య మనుగ్రహింపుఁడు, నాకు నిరాఘాటవాక్ప్రచారమునకు సెలవిండు.

శా. సారాచారములెల్లఁ జెట్టపడి, దురాచారావళీరోగముల్
తోరంబై వెడలంగఁబారి మఱుఁగం దుర్వాసనావాసితం
బై, రూపంబఱు, నియ్యజాండ మనుదేహం బె మన్నీతివా
గ్ధారాపూరరసాయనంబు లిడి శుద్ధస్ఫూర్తి క్షాళించెదన్. 33

ంహా — ఛీ, ఛీ, యూరకుండుము. నీవు చేయఁదలఁచిన విషయము నాకుఁ దెలిసినది.

ియం — ఏ మట్లనుచుంటిరి? నేను బందెమువైచి చెప్పఁగలను. మంచిని గాక చెడ్డ నెన్నఁడయినఁ జేయుదునా!

ంహా — ఉ. పాపుల దూఱి లోకమును బాగుగఁ జేసెదనంచు నీదుదు
ర్వ్యాపృతులెల్ల నెల్లెడ బయల్పడఁజేసిన నష్టకారి యా
పాపమె కాని లాభ మొకపాటియు లే దది యెట్లు, యౌవనో
ద్దీపనవేళ నీవు కడుఁ ద్రిమ్మరుమన్మథతంత్రఖేలనే
చ్ఛాపశువృత్తిఁ బైకుబుకసాగు వ్రణంబులు నొప్పుదుర్గతుల్
ఖ్యాపన సి యిక్కరణి నన్నెము పున్నె మెఱుంగనట్టి ని
ష్పాపమ ప్రజావళికిఁ బాపములం గఱపింతువే ఖలా. 34

ుం — గర్వమునుగూర్చి నే నొకయుపన్యాసము నిచ్చినచో నయ్యది

నాకే వర్తించు నని యెవ్వఁడు నన్ను నిందించును ? నాయుపన్యాసము నెవ్వఁడయినఁ దనయం దారోపించుకొని కలహింపవచ్చిన యెడల వానిని ముంచివేయునంతటి మహాసముద్రప్రవాహప్రాయమై యీగర్వ విషయకోపన్యాసము పరిణమింపదా ! మఱియు సార్వభౌమాంతఃపురాం గనా ధారణానురూపంబులైన చిత్రాంబరాభరణాదివస్తుకలాపంబుల ననర్హ లైనపురకాంతలు ధరించుట నింప మని నే నుపన్యసించినయెడలఁ దనయి రుగుపొరుగువారందఱు నట్లే సం రించుచుండ నెవ్వతె తనపై నారోపిం చుకొని నాపైకి రాసాహసించును. స్వల్పాదాయములోనివా రనల్పములైన వస్త్రములు ధరించుట యుక్తముగా దని నేనుపన్యసించునెడ నేసాధారణ మనుజుఁడు మావస్త్రములకై నీసొమ్మేమి వ్యయపఱిచితి వని నన్నధిక్షే పించునో వాఁడు తనలోపమును జెప్పకయే చెప్పినవాఁ డౌనుగదా ! ఇఁక నైనదా ? ఇఁకనేమి ? ఇఁకనెట్లు ? నాయుపన్యాసము లోకమ నెట్లు బాధించుచున్నదో నాకు వివరించిచూపుము. నాయుద్యమము లో మున కుపకారకారియే యైనచో నాపక్షమున లోకము దన్నుఁ దానే నిందించుకొనవలసియుండును. లోకము నాయుపన్యాసమునకుఁ బ్రాత ము గా యెడల నాపక్షమున నావాక్యము లెవ్వరిని బాధింపక యడవిఁ పురంబులు వోలె నెవ్వరికిని వర్తింపకుండును. కాని యెవరా వచ్చుచున్న వారు ?

(భీమబలుఁడు కోశోద్ధాత మైనఖడ్గముతోఁ బటాక్షేప ముగాఁ బ్రవేశించుచున్నాఁడు.)

భీమ — ఆఁగుఁ డాఁగుఁడు. ఇఁక నొకకబళ మైనను భుజియింపవలదు.

ప్రియం — అయ్యో ! నే నొకముద్దయినను దినలేదే !

భీమ — మాయుసపరము గ చుమటుకుం దినఁ జెల్లదు.

ప్రియం — ఈపుం జేజాతిలోఁ జేరినది ?

సింహ — ఉ. ఓదహనారుణాక్ష! భవదుద్ధతపద్ధతిఁ జూడఁజూడ ర
క్షోదనుజప్రచారములచొప్పు గనంబడె నార! లోకమ
ర్యాద లెఱుంగవో, యెఱిఁగియైనను వేఱుగతిన్ లభింపకీ
చైదముఁ బూనినాఁడవో, విచక్షణవృత్తి నెఱుంగఁ బల్కుమా.

భీమ — మొదటివాక్యముననే నామనస్థితిని దెలిసికొనినవాఁడ వైతివి. ఉపాయాంతరము లేని ప్రాణవ్యథ యనుకంటకము నాదేహముం బొడిచి నాయందుఁ గలసౌజన్యమును దీసివైచినది. నేను దొలుతనుండియు నాగరకతగలదేశమునఁ బెంపఁబడినవాఁడ నగుటచే సౌజన్యమును బాగుగా గుర్తెఱుంగుదును. అయినను నా పారము కొనసాగించువఱకు నిం దొక్కఫలమైన భక్షించువాఁడు నాచేఁ జావకతీరదు. కావున భక్షింపకుఁడు.

ప్రియం — నీవు న్యాయమగు రీతిని దృష్టి నందనియెడల నేను జావవలసినవాఁడనేనా!

ంహ — నీ కేమికావలయును? మాయెడల నీవిక్రమాతిశయముకంటె నీ నమ్రస్వభావముననే యుపయోగించిన నింతకన్న సుకరముగానే నీయభీష్టము నెఱవేఱునుగదా!

భీమ — ఆఁకలిచేఁ బ్రాణములు పోవుచున్నందున నాకీఫలంబుల నొసంగుఁడు.

ం — రండు. మాపంక్తినిఁ గూర్చుం భుజింపుఁడు.

మ — ఎంతమృదువుగా మాటలాడుచుంటిరి! నన్ను క్షమింపవలయునని ప్రార్థించుచున్నాఁడను. ఇచ్చట నుండువారెల్లరు నాటవికులే గదా యని యెంచి యింతటి దౌష్ట్యారంభమునకుం బూనుకొంటిని. మీ రెవ్వరయినను మనుష్యసంచారమునకు నసాధ్యమగు నీయరణ్యమునఁ జీఁకటులు క్రమ్ముశాఖాశాఖాచ్ఛాయయం దనుక్షణమును నిర్గమించుచుండు కాలము నెక్కుగంటల నశ్రగాఁ బోఁగొట్టుకొనుచున్నారు.

సీ. ఎన్నఁడైనను మీర లున్నత దశయందు
వర్తించిదీపించువారలేని
లలితఘంటారవంబులఁ బిల్చుచుండు దే
వస్థలంబుల నిల్చువారలేని
మన్నింపఁదగు మహామహగృహంబులవిందు
లారగింపఁగఁ బోవువారలేని
లోచనంబులనుండి తోఁచుబాష్పకణంబు
లారంగఁ దుడిచినవారలేని

గీ. యొకనిఁ గడు నాదరించి వేఱొకనిచేత
నాదరింపంగఁబడినట్టి యర్థులేని
వి యమే కార్యసాధన మని తలంచి
సిగ్గుపడి ఖడ్గ మిపుడె దాఁచెదను గాక !

సింహ—మేము నున్నతదశ ననుభవించినవారమే, పవిత్రమైన దేవాల గంటలచేఁ బిలువఁబడినవారమే, గొప్పవారియింట విందుల నారగి న వారమే. జాలివలన దలినబాష్పబిందువులను దుడుచుకొనినవారమే. కాన సుఖాసీనుఁడవై నీకొఱఁతను బూర్తిచేయఁజాలిన దంతయు మా ఁ గలి నదానినుండి యథేచ్ఛముగా భుజింపుము.

భీమ—అటులయిన/భోజనమునుండి క్షణకాల మాఁగుఁడు. ఈలో న డుఁబిచ్చుకఁబోలె నా ను వెతకికొనుచు నాహార మందిచ్చివ చూచను. లేమిచేతను ముదిమిచేతను డింపఁబడుచు నాయందలి యకారణస్నేహముచే నీరసమున నడుగులు తడఁబడఁ గుంటుకొనుచు నావెనువెంట బహు మరుగుదెంచిన యొకపురుషుఁడు కలఁడు. వృద్ధత్వము క్షుధయును నను రెండు నీరసమును గలిగించు కష్టములచే నణఁగఁద్రొక్కఁబడుచుండు నీత నికి మున్ను దృష్టి గలిగింపక నే నాహారమును స్పృశింపఁజాలను.

## ద్వితీయాంకము.

సింహ—నీవుపోయి వానిని దోడ్కొనిరమ్ము. నీవు రి శచ్చుచ్చ్వఅకునుమేయు వీనిని వ్యయపఱుపకుండ భద్రముగాఁ గాపాడెదము.

భీమ—మీకు నేను గృతజ్ఞుఁడను. ఇట్టి సద్గుణరాసు లగు మిమ్ములను భగవంతుఁ డనుగ్రహించునుగాక !

(భీమబలుఁడు నిష్క్రమించును.)

సింహ—కష్టానుభవము విషయమై మన మేకాకులము కామని మారీచరిత్రము వలనఁ దెలిసికొనవచ్చును.

గీ. విస్తృతాజాండనాటకవిపులరంగ
సీమలో మనచేఁ బ్రదర్శితములైన
యంకముల కన్న మిగుల దుఃఖాకరంబు
లైన యంకంబు లిఁకఁ బెక్కులై తనర్చు. 37

ప్రియం—సర్వప్రపంచము నొకనాటకరంగము, స్త్రీపురుషులందఱుం బాత్రమాత్రములు, జననమరణములు ప్రవేశనిష్క్రమణములు. ప్రతిపురుషునిజీవితమును నేడుభాగములుగా విభజింపఁబ యుండుటచే నానారససంకీర్ణమయిననటనముం బ్రదర్శించుచుండును.

1\. గీ. శైశవంబున, దాదిరక్షణమునందు
రుగ్మతలచేత నగుబాధ రోసి యడలి
యాఁకలికి నేడ్చి పాల్గ్రోలి యలరుచుండు

బాల్యమునఁ బాఠశాల కంపంగ, మదికి
సమ్మతములేక, మూల్గుచు, స్నాతుఁడగుట
కోమలంబైన రూపుతోఁ, గుటిలమైన
చిలువనడకల నడచుచు, గళమునందుఁ
బొత్తములసంచిఁ దగిలించి పోవుచుండు.

3. యౌవనంబునఁ దనప్రియురాలిఁ గూర్చి
ప్రార్థనాగీతములు వ్రాసి పాడుకొనుచుఁ
గొలిమితిత్తులువోలె నూర్పులు నిగుడ్చు

4. విక్రమాన మెయిఁ దాల్చి పెంచుకొనిన
మీసములు, బె_ లినిఁ బరిహాసమాడ
మాటిమాటి ఁ బదెముల్ దీటుకొనఁగ,
మానభంగంబు నొక్కింతయైనఁ గనక
చివ్వకును గాలుదువ్వుచు, జిఱుతగండు
నోటఁ దలఁదూయై సన్నుతిఁదనర్చు
బుద్బు ప్రాయమౌ తిఁ బొందఁజూచు.

5. న్యాయనిర్ణయదశనొంది యతిబలిష్ఠ
భోజనమ్మునఁ బెరిఁగిన పొట్టతోడ,
గృష్టితీవ్రతతోఁ గత్తెరింపఁబడిన
బ రిగడ్డంబుతో నీతివాక్యములును,
బూర్వచారిత్రములును, జెప్పుచు మెలంగు.

6. వృద్ధదశనొంది, శుష్కించి, విపులవేష
మందుఁ బ్రమదంబు మాని, ముక్కద్దములను
గనులధరియించి నిండుజవ్వనమునాఁటి
దుస్తులను భారముగనెంచి, తొలఁగఁజేసి,
జిలుఁగుదుస్తులఁదాల్చు, నెలుఁగుమాఱి,
కీఁచుగొంతుకతో నీల నైచుచుండు.

7. అంతకోన్ముఖదశఁ జెంది యంతసౌఖ్య
బాధ లెఱుఁగక, తలతిక్కపట్టు పట్టు,
ప్తి దగ్గును, దృష్టివిజ్ఞాన మెడలు, . .

దంతములునూడు, రుచి తెల్వి, యంతమొందు,
నిట్లు సర్వేంద్రియజ్ఞానహీనుఁ లగుచు
సప్తదశలొందుదురు ధాత్రిసర్వజనులు. 38

(భీమభలుఁడు సుమంతు నెత్తుకొని ప్రవేశించును.)

సింహ—నీకు స్వాగతము. గౌరవార్హమైన నీభారము నచ్చట దింపి యాతని నాహారము దిననిమ్ము.

మ—ఈవృద్ధునినిమిత్తము నేను గృతజ్ఞుఁడ నై యున్నాఁడను.

సుమం—(భీమబలు నుద్దేశించి) నాస్వశక్తిచేఁ గృతజ్ఞతం దెల్పందగిన యవస్థ యందు లేనుగాన మీరు తెల్పుటయే కర్తవ్యము.

ంహ—(సుమంతునుద్దేశించి) నీకు స్వాగతము. ముందుగా నిన్నుఁ గుశల ప్రశ్నలవలన నలయించుటకు నే నిష్టపడను. కావున నీ వీఫలాహారముం గొనుము. పిమ్మట నే ముచ్చటించుకొందము. (ఆనందు నుద్దేశించి) యోగ్యుఁడవయిన సోదరుఁడా నీగానామృతముచే మమ్మానంద ఱుపుము.

ఆనం—ఉ. శీతలవాతమా! మిగులఁ జెందుము చెందు మిఁకెట్టులైన దు
ర్నీతి కృతఘ్నుకన్నఁ గడు నిర్దయవృత్తివి గావు, నీసమా
ఘాతము సోఁకినం గటువుగాఁ గనిపించిన, నీ వదృశ్యపున్
భూతమ వౌట గ్రుచ్చుకొనఁ బోలవు నీయురుదంష్ట్ర లెంతయున్. 39

సీ. "ప్రాపంచికస్నేహభావ మాభాసంబు
కాంతకాంతానురాగంబుసున్న
భక్తియుక్తంబు గా భజనసల్పుటమేలు
జన్మ మానందవిస్తారకంబు
క్షారశీతగుణప్రచారావకాశమా
మమ్ముల ము గామార్పు మార్పు

మలకృతఘ్నత యంతబలవత్తరంబుగాఁ
జలపట్టి వేధింపఁ జాలవీవు,

గీ. అంబువుల గడ్డఁగట్టించునట్టిశక్తి
దనరి యున్నను బ సుకృతంబు మఱచు
నట్టి విశ్వాసఘాతుకునంత నీవు
శైత్యమా మమ్ము వేధింపఁజాలవు సుమ. 4

సింహ—(భీమబలు నుద్దేశించి) నీవు నిశ్చయముగా విజయభూపతిపుత్త్రుఁ డని రహస్యముగాఁ దెల్పియుంటివి కావున, నట్లే యగు నేని నీముఖమున బ్రతిబింబముగాఁ గానఁబడుచుండు నీతండ్రియొక్క విగ్రహమును కన్నులారఁ జూచుచుంటిని గావున నిశ్చయముగా దగ్గఱకు రమ్ము. (దగ్గఱకుఁ రఁదీసి కొనును) నాయనా! నీతం ని విశేషముగాఁ బ్రేమించిన రాజను నేనే. కావున నీవు నాతోఁ గూ నేను నివసించుగుహాంతరమ్ము, కేతెంచి యిప్పటికి నీకుఁ బోఁగామిగిలియున్న స్థితిగతులను నాకెఱిఁ పుము. (సుమంతు ను శించి) యోగ్యుఁడ వగువృద్ధుఁడా! నీయజమా. ని వెంట నీవు మాతో రావచ్చును. (భృత్యునిఁ జూచి) ఈవృద్ధుని జేయూఁత యొసంగుము. (వృ ప ను శించి) నీకైదండ నా కొసంగుము. (అని వృద్ధుని బాహువునఁ ద గా వునుంచి పట్టుకొనుచు) నీయో క్షేమములను నన్నుఁ దెలిసికొననిమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



౮

# చారుమతీపరిణయము.

## తృతీయాంకము.

### 1-వ రంగము.

రాజమందిరములోని యొకగది.

(ప్రవేశము—విక్రమసేనుఁడు, సామంతులు, ప్రద్యుమ్నుఁడు.)

క్ర—అప్పటినుండియు మీరు వానిని జూడనేలేదా! అయ్యా! ఇది కేవల మసత్యము. నేను దయాస్వభావుఁడనే కానియెడల నెదుట నున్నని వదలి దూరస్థుఁడై యున్నసీతమ్ముని వెదుక నేల ప్రయత్నించెదను? సహోదరుఁ డెచ్చట నున్న వెదకి తీసికొనిరమ్ము. జాగ్రత్త! కంచుకాఁగడా వైచి పరిశీలింపుము.

సీ. కరుణించి యొకయేఁడు గడు వొసంగితినీకుఁ
దతిలోన నీసహోదరుని మాకు
జీవితు నైన నిర్జీవితు నైన మా
యెదుటఁ బెట్టుము పెట్టవేని నీకు
మారాజ్యమున నెందు మనఁగడసున్నమా
యాజ్ఞను నెఱవేర్చునంతవఱకు
నీగురు క్షేత్ర విత్తాగారసౌధాది
సర్వస్వమును మావశంబుఁ జెందు,

గీ. మాకు నీయెడఁ గల యనుమానకార
ణంబు నీసహజన్మముఖంబువలనఁ
దెల్ల మగుదాఁక నొకపూరిపుల్లయైనఁ
గాని యొసఁగము పొమ్ము మాయాన సుమ్ము. 4

ప్రద్యు—దేవా! నానిజమైన మన స్థితి మీ రెఱిఁగిన బాగుగా నుండును. నాతని నెన్నఁడును ద్వేషించువాఁడనే గాని ప్రేమించి యెఱుంగను.

విక్రమ—అట్లయిన నీవు మఱియుఁ బరమదుర్మార్గుఁడవు గాఁ గాన్పించుచున్నావు. సరే. (భటునివంకఁ జూచి) సేవకా వీని నావలికి గెంటివేయుము. మనరక్షకభటులను బంపి వీని గృహారామక్షేత్రవిత్తాది సర్వస్వంబు స్వాయత్తంబు చేసికొని వీనిని లోనికి రానీయక తఱిమివేయవలసినదిగ మే మాజ్ఞాపించితి మని సచివోత్తమునితో నివేదింపుము. తత్క్షణ మ చేయుము. రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

## 2-వ రంగము.

### అరణ్యము.

( మబలుఁడు, చేత నొకకాగితముం బుచ్చుకొని ప్రవేశించుచున్నాఁడు.)

భీమ—(ప్రవేశించి) ఓనాపద్యమా! నాకుఁ గలప్రేమకు సాక్షివై నీవీచెట్టున వ్రేలాడుచుండుము. (అని తనచేత నున్నకాగితమును జెట్టునకుం గట్టి యాకసమువంకఁ జూచి)

గీ. కడఁగి నాజీవము నరికట్టినట్టి
చారుమతిని వ స్త్రమాస్యను లి ంచి
నట్టిప.తి.కఁ జెట్టునఁ గట్టినాఁ
విమలని యంబునుండి గాంచుము శశాంక! 42

గీ. పాలఁతి! యీభూరుహములె నాపుస్తకములు
చెలఁగి నాయూహ లెల్ల నీచెట్లపట్టు
లందుఁ జెక్కెద, దాన నీయడవి వంకఁ
జూచు ప్రతినేత్రమును నీదు సుగుణగణము
గాంచి యాశ్చర్యరసనిమగ్న మగుఁగాక. 43

మబలుఁడా! పరువెత్తుము. పరువెత్తుము. సౌందర్యరాశియు, సుగుణఖనియు, వర్ణనాతీతయు, నగుచారుమతియొక్క నామమును బ్రతివృక్షస్కంధముల యందును శిల్పన మొనర్పుము. (పరిక్రమించును.)

(అంగదుఁడును, విదూషకుఁడును బ్రవేశింతురు. భీమబలుఁడు నిష్క్రమించును.)

గదు — అయ్యా! విదూషకుఁడు గారూ! ఈ మాగొల్లమనుగడ మీకెట్లు గాఁ దోఁచుచున్నది?

విదూ — ఓరీ! గొల్లవాఁడా! నిశ్చయముగా మనుగడమట్టుకు బాగుగనే యున్నది. కాని గొల్ల లను పేరుఁ జేర్చుటచే వ్యర్థమయినది. ఇది నిర్జన మగుటచే ననుకూలముగానే యున్నది గాని నిగూఢమగుటచే నీచముగా నున్నది. సుక్షేత్రమం దగుటచే సంతోషముగానే యున్నది కాని ధర్మాస మునఁ గాకుండుటచే విసుగుఁదలగా నున్నది. అల్పాహార మగుటచే రోగ్యముగానే యున్నది. కాని తృప్తిమంతము కాకుండుటచే నాపొ ఒటలేదు. నీలో నేమైన వేదాంత మున్నదా గొల్లవాఁడా!

అం — ఒకనికి రోగము పెరిఁగినకొలఁది నోర్పు తగ్గుచుండును. రొక్కమును రమును, దృష్టియుఁ గొఱఁత యైనవాఁడు ముగ్గురు నేస్తులు లేనివాఁడు. వాన తడుపును; అగ్గికాల్చును; బీళ్లుముమ్మ ముగా గ పతి గొఱ్ఱెలకుఁ గండపట్టును. రాతిరి వచ్చుటకుఁ బ్రొద్దు గ్రుంకుటయే గొప్ప ణము. చమత్కారము, విద్దెయు నబ్బనివాండ్రు పెద్దలు చిన్నప్పుడు

గారముచేసి చెడఁగొట్టి రనియు, లేక బీదకుటుంబములోనివాం డ్రు మ
టచే నబ్బలే దనియుం జెప్పుచుందురు. ఇదియే నాకుఁ దెలిసినవేదాంతము.

విదూ—ఇట్టివాఁడు సహజజ్ఞాని. గోపకుఁడా! నీ వెప్పుడయిన రాజసంస్థాన
మున నుంటివా?

అంగదు—నిజముగా నే నెప్పుడు నుండలేదు.

విదూ— అటులైన నీవు నరకమునకుఁ బోఁదగినవాఁడవే.

అంగదు—అట్లుకాదు. నేను—

విదూ—ఒకవైపున మాఁడి రెండవవైపునఁ గమలియున్న కోడిగ్రుడ్డువలె నీవు
దప్పక నధోగతిపా లగుదువు.

అంగదు—రాజసభయం దుండకున్నంతమాత్రమున నేనా యీకారణములు?

విదూ—ఎందుకు—వినుము. నీవెప్పుడును రాజసభలయం దుండనియెడల ద్వ
ర్తన మబ్బదు. సద్వర్తన మబ్బనిచో దుష్ప్రవర్తన మలవడును. దుష్ప్రవర్తన
మునఁ బాపమును, బాపమువలన నరకమును సిద్ధించును. గొల్లవాఁ -!
నీవు కడు దుస్థితిలో నుంటివి.

అంగదు—విదూషకుఁడా! అ ట్లింతమాత్రమును గాదు. పల్లెటూరివాం
నడవ కొలువుకూటమువారి కెట్లు నవ్వులాలగా నుండునో కొలు
కూటము వారిది పల్లెటూరివారి కట్లే వెక్కిరింతగా నుండును. నీ
కొలువుకూ మువారు దండములకు బదులు చేతులు ముద్దుపెట్టుకొందు రని
చెప్పియుంటివి. అక్కడివారు గొల్లలే యైనచో మిక్కిలి రోఁత
నుండును.

విదూ—ఏది? ఉదాహరణము. రా! స్పష్టముగాఁ జూపుము.

అంగదు—ఎందుకయా! మే మిప్పటికిని నాఁడుగొఱ్ఱెలను ముట్టుకొనుచు
దుము. వానిచర్మములు జిగురుగానుండును. నీవెఱుఁగవా!

విదూ—రాజసభలో వారి చేతులుమాత్రము చెమట ట్టవా? గొఱ్ఱెలజి

మనుష్యులచేమటకంటెను నేహ్యముగా నుండునా? ఇది చాలదు. చా లదు. మ్మ్. ఇంకొక మంచియుదాహరణమును జూపుము.

అంగ—ఇంతియే గాక మాచేతులు కడుమొరటుగా నుండును.

—నీపెదవులే వానిని శీఘ్రముగా గుర్తింపఁగలవు ? ఊఁహూఁ! ఇది యును జాలదు. ఇంతకంటె మంచిపునాది గలయుదాహరణముఁ జూపుము.

అంగ—మఱియును నాగొఱ్ఱెల పుం కు మందులఁ తఱచు రాయుచుండుటచే మాచేతులు కిలముపట్టి వన్నెమాసి యుండును. మమ్ముల నట్టికిలమును ముద్దుపెట్టుకొను మందువా ! రాచకొలువులోనివారు పునుఁగు, జవ్వాజి, న్నగుసువాసనవస్తువులు చేతులకుఁ బూసికొని యుందురు.

—మిక్కిలి గాఢమయినవాఁడవు. నిన్ను శుద్ధమయిన పలలముతోఁ బో ్నరయెడలఁ గీటకయోగ్య మగుచెడుమాంసము వంటివాఁడవు. దూర లోచించి గుణవంతులయొద్దనుండి మంచిచెడ్డల నేర్చుకొనుము. పునుఁగు నుఁ గని మిక్కిలిగా వర్ణించితివి కాని యది నీచేతికిలముకంటె నీచ ాయినపుట్టువు కలది సుమా ! అది కేవలము మార్జాలపురీషము. నీయుదా రణమును మార్చుకొనుము.

అం—నన్ను మించిన రాజయోగ్యము లగుతెలివితేటలు నీయొద్దఁగలవు. ను మిన్నకుండెదను.

— రకమున కేగి మిన్నకుందువా ? దేవుఁడు నీకు సహాయుఁ డగును క ! వె వాఁడా ! దేవుఁడు నిన్ను బాగుచేయునుగాక ! నీవేమియుఁ పాకము లేనివాఁడవు.

—అయ్యా ! నేను నిజము కల కూలివాఁడను. నాయాహారము నేనా కొని నుచుందును. నాకట్టుబట్టలను నేనే సంపాదించుకొందును మును నేనెవ్వనికి నచ్చిలేను. నేనెవ్వనిసౌఖ్యమును గాంచి యసూ ందను. ఇతరులమేలుం గూర్చి సంతసించెదను. నాకుఁ గస్తికలి న

నోర్చుకొనియెదను. నాగొఱ్ఱెలు తృప్తిగా మేయుటయు, గొఱ్ఱెపి పాలుగ్రోలుటయుఁ జూచుటయే నాకు మిక్కుటమైన గర్వకారణము.

విదూ—ఇదియు నీకు మతియొక యజ్ఞానదోషము. దీనినుండి నీవెట్లు తప్పించుకొందువో గదా !

అంగ—మాక్రొత్తయజమానురాలిసోదరుఁడును, నాయజమానుఁడు నగువ తుఁ డిటులే వచ్చుచున్నాఁడు.

(చారుమతి చేత నొకకాగితముం బట్టుకొని చదువుచుఁ బ్రవేశించును.)

చారు—చం. మఱవక సేతుశీతగిరిమధ్యమహీతలమెల్లఁ గాంచినన్
దొరకునె యట్టి చారుమతితోఁ దులఁదూఁగినభూషణంబు, సుం
దరి యగునా మెఱుపము ఘనం బగువాయుతురంగ మెక్కి త్రి
మ్మరె భువనంబులెల్ల, నతిమాత్రపుఁజాతురితో లిఖించు చి
త్తరువులు గూడ నామెదరిదాపున నిల్పిన నల్లబొగ్గులౌ,
హరిహరి ! నాదు నెమ్మనమునందుఁ దదీయమనోహరాంగవై
ఖరులనె కాక వేఱొకటి గ్రాలఁగనీయదు నీకు మ్రొక్కెదన్.

విదూ—అల్పాహారము, భోజనము, నిద్ర యీవేళలం దక్కఁ దక్కినవేళల నిట్టిగీతము లెనిమిదేండ్లయిన నెడతెఱపి లేక చెప్పఁగలను. ఈచంప మాలిక నిశ్చయముగా రాజవీథి నొకతె వెంట నొకతె మెల్లఁగాఁ బ చల్లలమ్ము గొల్లపడుచులచాలువోలె నున్నది.

చారు—బుద్ధిహీనుఁడా ! పొమ్ము పొమ్ము.

విదూ—నాకవిత్వముఁ గూడఁ జవిచూపెద.

చం. హరిణము లేడికై వెదకునప్పుడు సమతిం గనుంగొనం
దొరకొను, గంతుఁబి తన యాలి నె టంబడ గ వాడుసుం
దరికి ననుంగుఁదాపము ఘ ం బగునుం ఁ, గృ. ంగియైన నా

తరుణికి శీతకాలపరిధార్యములం జమిలించినట్లు తే
ర్పటిచిన బల్ఫుఁజెందు, నొనరన్ వరిఁ గోసియు నూర్చి ధాన్యమం
దఱు నెగురంగఁబోసి త్వరితంబుగ బండి నమర్చి దానబి
త్తరిఁ గొనిపోవలెం, గఠినతం దగు రెంకలలోపలన్ మనో
హర మగుతియ్యపప్పు వలె హా! యనిపించును నాలతాంగి, య
బ్బుర మగుకేతకీకుసుమముం గొనుచుండఁగఁ గంటకంబులే
తఱిఁ బొడువంగసాగిన విధంబునఁ జారుమతింగొనన్ భయం
కర మగుతీవ్రమోహ మనుకంటకముల్ మదినేర్చు నక్కటా! 45

దియే గీతముల వక్రధావితము. ఇట్టివానితో నిన్నేల పాడుచేసికొం

య—ఓరీ! యవివేకపుమొద్దా! ఊరకుండుము. ఈమాలిక నొకవృక్ష గ్రంథమునఁ గాంచితిని.

—నిశ్చయముగా నాచెట్టు చెడుకాయలు కాచుచున్నది.

గ—ని న్నాచెట్టున కంటఁగట్టిన యెడల గ్రచ్చచెట్టున కంటఁగట్టిన గును. అప్పు డది ప్రప్రథమముననే దేశమునఁ బండ్లు రాల్చునది గును. మఱియు నీవు పండ్లుపండకమున్నే యెండి క్రుళ్లిపోయెదవు. అకారణముగఁ బరులహింసించు దుస్తరుల కిది యుక్తమైన ఫలితమేగదా?

—బాగుగాఁ జెప్పితివి. ఈవాక్యములయందలి రసమో నీరసమో యర వృత్తములే పరిశీలించునుగాక

కమల యొకవ్రాసినకాగితముం బట్టుకొని చదువుచుఁ
ప్రవేశించును.

—(విదూషకునితో) సద్దు సేయకుము. నాసొంపరి యగుకమల యొద్దియో ప్రము నిటులే వచ్చుచున్నది. కొంచె మో సిల్లుము.

కమ. గీతమాలిక. విపిన మిది యేలకొావలె! విజనమాట
వలననా? కాదు; ప్రతిపాదపంబునకును
నాలుకలు వ్రేలఁగట్టెద; లీల నవియు
నాగరకతకు ననువగు నవ నీతు
లను బ్రబోధించుచుండు నెట్లనఁగ ధరణి.

గీ. ప్రజల జీవిత మొకరహాత్రవంటి దరయ;
జననమాదిగ మరణంబుదనుక మనుజుఁ
డెంతనడచిన నొక నెఁడంతకన్న
మించఁ డాప్తులతో నొనరించునట్టి
మితికి మీఱినశపథముల్ మించుచుండు.

గీ. అవనిరుహశాఖలందు వా ంతములను
నబ్జముఖిపేరు లిఖియింతు; ందువలన,
జగతి జీవులయోగ్యతాసారమందు
నిగ్గుఁజేకూర్చి సకలనిర్ణేత యాయిన
భువనప చారుమతిరూపమున నిమిడ్చె
ననచుఁ జదివెడు ప్రతిమానవునకుఁ దోఁచు.

గీ. వితతలావణ్యవినయవివేకముఖ్య
సకలసద్గుణవితతిఁ బ్రజ్వరిలఁజేయ
వలయు నొకవ త్తి ననుచు స్వభావమునకు
నానఁ యంగ బోలు సర్వాధిపుండు;

గీ. తారనుం బోలుఁగాని సౌందర్యమందు
వ నంబునఁ బోల దాకీర్తితాంగి;
యహహా! ఘనతరకార్యనిర్వహణమందుఁ
బోలు సాత్రాజితిని; విక్రమాలవాల;

గీ. స్మరసతినిఁ బోలు సరాంగసౌష్ఠవమున;
సాధ్వి యనఁజెల్లు జ్ఞాన సతినిఁ బోలి;
వసుమతి ననేక కాంతల వదనములును,
నేత్రములు, మానసములు, నీ నెలఁతయందుఁ
బ్రస్ఫుటంబుగ నిమిడింపఁబడె; నిదెల్ల
నలినభవుఁ డీమెయందె యు నిలుపుఁగాక!
యిలను మెయివడుదాఁ న స్త్రీలతాంగి
దాసునిగఁ జేయుఁగాక పద్మాసనుండు. 46

ర—ఓ యోగ్యుఁడవయిన యుపదేశికుఁడా! దీర్ఘమయిన మోహాంతంత్రోపన్యాసముచే నీయంతేవాసుల నెంతొ విసికించితివి? కాని నడుమ నొక్కసారి యయినను స త్రులారా! సద్విషయము బోధించుచుంటిని గావున నించుక సహించి వినుఁడు. అని మా విసుగుదల సహసయింపక పోయితివి.

మ—(గోపకుని విదూషకునిఁ జూచి) ఓహో మీరుఁ గూడ నిచట నుంటిరా! స్నేహితులారా! కొంచె మోరసిల్లుఁడు. గొల్లవాఁడా! ఆవలికిఁ జనుము. బాలిశా! నీవును గొల్లవానితోఁ బొమ్ము.

దూ—గొల్లవాఁడా! రా రమ్ము. మనము కొంచము మర్యాదతోనే పోవుట మంచిది. కంచము, ముంత, పట్టుకొని కాకపోయినను, కొంకి, గొంగలి బుజమున వేసికొని పోవుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

—ఈగీతములను వింటివా?

—ఆహా! వాని నన్నింటిని వింటిని. వానినే గాదు. ఇంకను నెక్కువని. ఏలయన గీతముల మోయునంతటికంటె నెక్కుడు చరణములుఁ గొన్నిటికిఁ గలవు.

కమ—అది యొక్క లెక్కలోనిది గాదు. చరణము లెక్కువయిన గీతముల మోయఁజాలకపోవు గదా!

చారు—అట్లే యగునుగాని పాదము లెగుడుదిగుడు గలవి యగుటచేఁ బద్యము నాధారముచేసికొనకుండ స్వతంత్రముగా నిలువఁజావు. అందు హ్రస్వము లగుపాదము లప్రయోజనములై పద్యమునంటుకొని వ్రేలాడుచుండును.

కమ—కాని, చెట్లయందు నీపేరు చెక్కఁబడుటయుఁ, బత్రికలయందు వ్రాయఁబడి వ్రేలాడుచుండుటయు నీ కాశ్చర్యము గలిగింపలేదా!

చారు—నేను బొందవలసిన యాశ్చర్యముయొక్క పరమావధికాలమందు ముప్పాతికమువ్వీసము నీవు వచ్చునప్పటికే గడచిపోయినది. ఏలయన, నేనొకఖర్జూరవృక్షమునఁ గాంచిన దీనిం జూడుము. వేదవ్యాసునికాలమున నేను మూషకము నైనట్లు జ్ఞాపకము. నాఁటనుండి నేఁటివఱకు నెత్తినజన్మాంతరములయం దెన్నఁడును గీతములచే నిట్లు కీర్తింపఁబడలేదు.

కమ—దీనికిం గారణ మెవ్వరో నీకుఁ దెలియునా?

చారు—మనుష్యుఁడే యైయుండునా?

కమ—నాఁడు నీ వెవ్వనికంఠమున ముక్తాహారమును వైచితివో యాతఁడే.

చారు—(నివ్వెఱపడి చూచుచుండును)

కమ—ఈవైవర్ణ్య మేమి?

చారు—నీపుణ్యమాయె నెవ్వరో చెప్పుము.

కమ—అయ్యో దైవమా! మిత్రసమావేశము కడుదుర్లభము. అయినను భూకంపమువలన దూరస్థము లైనయచలములు గూడ సమీపించును గదా!

చారు—దానికేమి గాని యాతఁ డెవ్వఁడై యుండును!

కమ—ఇది యేమి చో ము!

చారు—రాజసన్నిధిని విన్నవించుకొన్నట్లు నిన్ను నిక్కిలి ప్రార్థించెద నిఁ నైనం జెప్పుము.

క్షమ—అద్భుతము! అత్యద్భుతము!! మహాద్భుతము!!! చెప్ప నలవిగాని య ద్భుతము!!!!

చారు—నాసౌందర్యముతోడు. బాహ్యమున ధరించినపురుషాకృతి యంతరంగ మునఁ గూడ నుండు ననుకొంటివా! నీ వింకొకనిమిష మాఁగినచోఁ బ్ర శ్నాంబుధిని మునుంగుదువు. నిన్ను బతిమాలుకొనుచుంటి నాతఁ డెవ్వఁ డో యాలసింపక శీఘ్రముగాఁ జెప్పుము. దైవము నిన్ను నత్తిదానినిగా నైనను జేసిన బాగుండును. అటులైన గిండ్లనుండి ద్రాక్షారసంబు భంగి నొ కనిమిషమాఁగి యింకొకనిమిషమున కైనను నీనోటినుండి నీవు దాఁచియుం చిన పురుషుని నామ మువ్వెత్తుగ నొక్కసారి వెలువడును గదా! దయ చేసి నీనోటినుండి బిరడాను వదలింపుము. అట్లయిన నీవార్తామృతముం గ్రోలెదను. భగవంతునిచే సృజింపఁబడిన వాఁడేనా? వాఁ డెట్టివాఁ డు? చుబుకంబు కూర్చార్హ మైనదేనా?

క్షమ—వాని గడ్డము కడుఁజిన్నది.

చారు—అయిననేమి! అతఁడు కృతజ్ఞుఁడై యుండిన యెడల దైవమనల్పము గా ననుగ్రహింపఁగలఁడు. ఎవని గడ్డముం గూర్చి నీ విందనుక ముచ్చటిం చుచుంటివో వానిజ్ఞానమును నాకుఁ గలిగించిన వానిగడ్డ మెదుగునంత వఱకు నిరీక్షించి యుందును.

క్షమ—మల్లుని నీహృదయమును నేకకాలముననే తన్నుకొనిపోయిన యువకుఁ డగునాభీమబలుఁడు.

చారు—ఈపరిహాసముల కేమి లెమ్ము. ఇవి పిశాచకృత్యములు. ఇఁకనైన గరి తవై సత్యము వచింపుము.

మ—అక్కా! నీతోడు. ఆతఁడే!

చారు—భీమబలుఁడే?

క్షమ—భీమబలుఁడే!



చారు—అయ్యో ! ఎంతటిదుర్దినము ! ఈపురుషాకృతి నేమిసేయుదును ? నీవాతనిం జూచినప్పు డేమిచేయుచుండెను ? అతఁ డేమిచెప్పెను ? ఎట్లు గాఁ గాన్పించెను ? ఎచ్చటి కేగెను ? ఇచ్చట నేమిచేయుచుండెను ? నన్నుఁగూర్చి ముచ్చటించెనా ? నివాసమెచ్చట ? నిన్ను విడిచి యెట్లు పోయెను ? నీవు తిరిగి వాని నెప్పుడు చూచెదవు ? ఈప్రశ్నల కెల్ల నొక్కమాటతోఁ బ్రత్యుత్తర మిమ్ము.

కమ—అఘాసురుని వక్త్రమును నాకొకసారి యెరవుదెచ్చి యిమ్ము. ఇప్పటి పరిమాణము గలయేనోటియందైనఁ బట్టఁజాలదు. ఈప్రశ్నముల కొఁగాములు చెప్పుట సంగ్రహగ్రంథమును వివరించుటకంటె దుర్ఘటము.

చారు—నే నీయరణ్యమునఁ బురుషవేషముతో నుంటి నని యాతఁ డెఱుంగునా ! మల్లయుద్ధమునాఁటి బలిష్ఠతతో నుండెనా ?

కమ—కాముకులప్రశ్నలకు సదుత్తరంబు లిచ్చుట పరమాణువులఁ బరిగణించుట వంటిది. నే నాతనిం గాంచిన వైఖరిని వివరించెదను. శ్రద్ధతోఁ జవిచూచి రసానుభవముం గాంచుము. నేనాతని నొక్కరసాలచ్ఛాయను బరిపాకపతితమైనసూత్నఫలముంబోలెఁ గాంచితిని.

చారు—ఇట్టిమహాఫలంబు నిచ్చునది సురసాల మనవలయును.

కమ—అక్కా ! చారుమతి ! నామాటలకు నడుమ నడ్డుదగులక సమగ్రముగా వినుము.

చారు—నివేదింపుము.

కమ—ఆతఁడు శరవిద్ధుఁడైన యుద్ధశూరునివలె శయనించి యుండెను.

చారు—ఆస్థితిఁ జూచుటకు విచారకరమైనది, యైన నాభూమి కలంకారము.

కమ—నీరసనాశ్వంబునకు బందము వేయుము. సమయాసమయ వివేకమును విడిచి యిచ్చవచ్చినట్లు దుముకుచున్నది. అతఁ డొకయాఖేటకుని చందంబున నున్నవాఁడు.

చారు — అయ్యో! గ్రహచారమా! వాఁడు నామనోమృగమును వేఁటాడ వచ్చుచున్నాఁడు.

కమ — అడ్డుపగులక నాపాట నన్నుఁ బాడనిమ్ము. మాటిమాటికి శ్రుతిఁ బాడు సేయుదువు.

చారు — నే నాఁడుదాన ననుమాట నీవెఱుంగుదువా? యెఱుంగవా? నేను యోజించినది యెల్ల వెలివఱుచుచుండవలెను. ప్రియురాలా! చెప్పుము.

కమ — నీహృద్గతాంశముల నెల్ల బయటికి లాగుచుంటివి. సద్దుచేయకుము. ఆతఁడిచ్చటకు వచ్చుట లేదా?

(భీమబలుఁడు, ప్రియంవదుఁడు ప్రవేశించుచున్నారు.)

చారు — మన మీప్రక్క నొదిఁగియుండి యీతనిచర్యలం జూతము.

ప్రియం — నాకు సహచరుఁడ వైయుండి సందుకు నీకు మిక్కిలి కృతజ్ఞుఁడను. నే నసహాయుఁడనై యున్నను నిశ్చయముగా నింతయానందమును బొందు వాఁడనే.

భీమ — నేను నట్లే యుండి యుందును. అయినను నాచారనిర్వహణంబునకై నేనును నీయనుసరణంబునకై కృతజ్ఞతావచనముం బలికెదను.

ప్రియం — భగవానుఁడు నీకు సహాయుఁ డగునుగాక! మన మింతటినుండి సాధ్యమయినంత తక్కువగాఁ గలసికొందము.

భీమ — అట్లుగాదు. మన మెన్నఁడును బరిచితులము గానియట్లే యుండవలెను.

ప్రియం — ఇంతకెన్నఁడును, పట్టలపై మోహగీతంబులు చెక్కి వృక్షములఁ బాడుచేయవల దని నిన్నుఁ బ్రార్థించుచున్నాను

భీమ — ఇఁక నెన్నఁడు నాచక్కని గీతములను నీ పస్వరములతోఁ బాడి పాడుచేయ వలదని నిన్ను మిక్కిలి వేఁడుకొనుచున్నాను.

ప్రియం — నీప్రియురాలిపేరు చారుమతియా?

భీమ—అగును. సరిగాఁ జెప్పితివి.

ప్రియం—ఆపేరు నాకంత హితముగా లేదు.

భీమ—పాప మామెకుఁ దల్లిదండ్రులు నామకరణముసేయునపుడు నీతోఁ జెప్పకపోయిరి.

ప్రియం—ఆపె యెంతటి పొడవరి?

భీమ—నాహృదయమంత యెత్తుగా నుండును.

ప్రియం—నీ కెప్పుడును మంచిసమాధానములు సిద్ధముగా నుండును. నీకగ సాలపడుచులతోఁ బరిచయము లేదు కానోపు. వారియంగుళీయకములపై నున్నముద్రణముం బట్టి వారిం దెలిసికొనవలయును.

భీమ—అట్లుగాదు. సామాన్యకుటుంబినులు చిత్రపటంబులపైఁ దమభావాములఁ జిత్రింపించి గోడలపై నలంకరింతురు. వానింగాంచి నీవిట్లు పలుచుంటివి.

ప్రియం—నీవు తీవ్రమైన చాకచక్యము గలవాఁడవు. ఈవేగము పవనసూనుని పాదములనుండి యలవడి నట్లున్నది. నీవు నాతోఁగూడఁ గూర్చుండెదవా? మనయుభయులకుం బ్రియురాలగు ప్రకృతికాంతను, దానివలనఁ గల్పింపఁబడిన దౌర్భాగ్యమును దిట్టిపోయుదము.

భీమ—నన్నే దక్క ప్రపంచమున నూపిరిపుచ్చు నేప్రాణినైనను నిందింపను. నాయందే లెక్కలేని లోపములు గలిగియున్న వని నేనెఱుంగుదును.

ప్రియం—నీయందలి లోపము లన్నిటియందును ముఖ్యమయినది ప్రేమింపకుటయే.

భీమ—ఇది నీయందుఁ గలఘనమైన సద్గుణముతో నైనను వినిమయింప నిచ్చగింపని గొప్పతప్పు. నిన్నుఁ జూచిన నాకుఁ గడు విసువుదలగా నున్నది.

ప్రియం—నాసతముతోడుగా నే నొకవిదూషకునికై ప్రయత్నించుచుండఁగా నీవు ల ంచితివి.

భీమ—నాఁడాతటాకమునఁ బడిమునింగిపోయెను. కొంచెము నీళ్లలోనికి వంగి చూడుము. నీకే కాన్పింపఁగలఁడు.

ప్రియం—(నీళ్లలో తొంగి చూచి) అచట నాప్రతిచ్ఛాయయే కాన్పించుచున్నది.

భీమ—దాని నే నొక విదూషకునిగానైనను, సున్నగానైనను భావించెదను.

ప్రియం—ఇంక నే నీచెంగట నుండను. ఓమోహావతారమా! నీకు శుభమగుఁగాక!

భీమ—నీవు వెడలిపోవుటకుఁ జాలసంతోషముగా నున్నది. ఓవిచారావతారమా నమస్కారము.

(ప్రియంవదుఁడు నిష్క్రమించును.)

చారు—(అపవారించి కమలతో) పెంకెతనంబుఁ జూపు కితవభృత్యునింబోలి నటించి యీతనితో ముచ్చటించెదను. ఈవేషముతోడనే వీని నొకవెంగలినిఁజేసి యాడించెదను (భీమబలు నుద్దేశించి) ఓయాటవికుఁడా! వినఁబడుట లేదా?

భీమ—బాగుగనే వినఁబడుచున్నది. నీ కేమి కావలయును?

చారు—ఇప్పు డెన్నిగంటలైనదో చెప్పఁగలవా?

భీమ—దినంబున నెంతకాలము గతించిన దని ప్రశ్నించిన బాగుగానుండును. ఈఘోరారణ్యంబున గంటలు చెప్పుటకు గడియారము లెచ్చటనున్నవి.

చారు—అటయిన నీయరణ్యమునఁ గాముకుఁ డెవ్వఁడును  ఁడు. ఉన్నయెడల నుక్షణంబును వెలువరించు నిట్టూర్పులతోడను దనార్ద్వనులతోడను సోమరియైన కాలగతికంటె స్వతంత్రముగాఁ గాలనిర్ణయముఁ జేయుచుండును.

—ఆకాలగతిని దీవ్రమయిన దని యేలచెప్పరాదు? ఇదియును దీని కనురూపమే కదా!

! అట్లనుట కవకాశమే లేదు. అది భిన్నభిన్నస్వభావులతో గలఁ బ్రవర్తించుచుండును. ఈకాలాశ్వ మెవ్వనితో ధారిత ...చుచునో, వేనితో వల్గితగమనంబు సల్పునో, ఎవనితోఁ బ్లుత నటనం బొనర్చునో, వేనితో స్తంభీభావము నొందునో నీకుఁ జెప్పఁగలను.

భీమ — వేనితో వల్గితంబు సలుపునో దయచేసి చెప్పవలెను.

చారు — దైవసాక్షిగాఁ జెప్పుచుంటిని. నిరూఢయౌవనయైన కన్యకు సంబంధ నిర్ణయము మొదలు వైవాహికముహూర్తమువఱకు నడుమఁ గలవ్యవధాన మందుఁ గాలాశ్వ మామెతోఁ గఠినమైన వల్గితగమన మాచరించును. ఏల యన, నీవ్యవధానమునఁ గాలాశ్వగతిసప్తాహంబు లైనచో సప్తవత్సరంబు లంతటికఠినముగాఁ దోఁపఁగలదు.

భీమ — ఎవనితో ధారితక మాచరించును!

చారు — గీరాణభాషాజ్ఞానము లేనిమతగురునితోడను, వాతరోగములేని ధన వంతునితోడను, ధారితకమును గలిగి యుండును. మొదటివాఁడు వి విహీనుం డగుటచే గ్రంథవ్యాసంగమున కనువుపడక సుఖముగా నిద్రించు చుండును. రెండవవాఁడు శారీరవంథావిరహితుఁడై స్వేచ్ఛగాఁ బ్రవర్తిం చును. ఒకనికి శరీరమును గృశింపఁ జేయు విద్యాభారములేదు. ఇంకొకనికి దినదినాభివృద్ధిఁ జెందు దారిద్ర్యభారములేదు.

భీమ — వేనితోఁ గాలాశ్వము ప్లుతగతుల నెరపును?

చారు — వధ్యస్థానమునకుఁ గొని పోఁబడు నరహత్యాపాతకునితో — ఏలయన్న, వాఁడు గమ్యస్థానమునకుఁ బోవునపుడు మందగతుల నెంతకాలయాపన మొనర్చినను నిమిషమాత్రముగాఁ బరిగణించును.

భీమ — ఎవనితో స్తంభీభవించును?

చారు — సెలవుదినములయందు న్యాయవాదులతో — వారికాలమునఁ గాంచా లోచనములేక నిద్రించుచుండుటచేఁ గాలగతిని గుర్తింపఁజాలరు.

భీమ—ఓసుందరుఁడా! నీనివాస మెక్కడ?

చారు—కంచుకము నాశ్రయించు సరిగంచువోలె నున్న యీవనోపకంఠంబున నాసహోదరియైన యీగోపికతోఁ గూడ వసించి యుంటిని.

భీమ—నీ కిది స్వదేశమేనా?

చారు—స్వస్థానంబు విడువని శశకంబులకుఁబోలె.

భీమ—నీవచనరచన యరణ్యమున లభింపఁదగిన దానికంటె మిన్నగా నున్నది.

చారు—ఇట్లే పలువురు పలికిరి. యౌవనదశయందు నాగరకుఁడై వార్ధకంబున యతాశ్రమంబు గ్రహించిన నాపితృవ్యునివలన నీమృదుసంభాషణము నాకలవడినది. అతఁ డచ్చట నుండుకాలమున స్త్రీపరాయత్తచిత్తుం డగుటచే మోహతంత్రమందు మిగుల నిపుణుఁడు. పిమ్మట నామోహతంత్రంబునకు వ్యతిరేకంబుగ నుపన్యాసంబు లనేకంబులిచ్చుచు స్త్రీలంగూడ దూషించుచుండెడువాఁడు. ఆదూషణంబులకు లోనుగాకుండ నన్ను స్త్రీనిగా సృజింపక పురుషునిగా నిర్మించినందునకు భగవంతునకు మిక్కిలి కృతజ్ఞుఁడనై యున్నాను.

భీమ—అతఁడు స్త్రీలయం దారోపించిన ముఖ్యదోషంబు లెవ్వియైనను నీకు జ్ఞప్తియందుఁ గలవా?

చా—ముఖ్యమైనవి యెవ్వియును లేవు. కాని కాసులవలె నన్నియు సమానములే. ఒండవది చెప్పువఱకు దేనిమట్టు కదే యుత్కృష్టమై తోఁచును.

భీమ—అట్లయినఁ గొన్నిలోపములు తిరిగి లెక్కింపుము.

చారు—రోగులపైఁ గాని నాయౌషధముఁ బ్రయోగింపను. ఒకమనుష్యుఁడీయరణ్యమున భూతమువలెఁ జరించుచు పట్టలపైఁ జారుమతి యనుపేరుఁ జెక్కి తరుణతరుజాలంబుఁ బాడుసేయుచుండెను. పూఁబొదరింటిపై వర్ణనాగీతంబులను వ్రేలాడఁగట్టి నిశ్చయముగఁ జారుమతీనామమును భగవన్నామమువలెఁ గొలుచుచున్నాఁడు. ఈకాముకుఁడు మదనజ్వర

పీడితుండైనట్లు గాన్పించుచుండెం గావున నే నాతని గలిసికొనఁగలిగితి నేని మంచిసదుపాయము బోధింపఁగలను.

భీమ—ఇట్లు మోహసంచలితుఁ డైనవాఁడను నేనే గావున నీప్రతిక్రియా విధానమును నాకెఱింగింపు మని ప్రార్థించుచున్నాను.

చారు—మాపినతండ్రిచేఁ జెప్పఁబడిన కాముకలక్షణంబులు నీయందుఁ గాన్పించుటలేదే! మోహపరవశుని గనుంగొనువిధానము నా కాతండే నేర్పియుండెను. శరపంజరమువంటి మోహబంధమున బందీకృతుండ వైనట్లు గాన్పించుటలేదే!

భీమ—మీపినతండ్రిచేఁ జెప్పఁబడిన లక్షణంబు లెవ్వి ?

చారు— శుష్కించినచెక్కులు ; అవినీయందుఁ గానరావు. నీలవర్ణముగ గుంటలువారిన కన్నులు ; అవియును నీయందుఁ గానరావు. మిత్రులతోడ సంభాషించుటయం దిచ్ఛలేకపోవుట ; అదియును నీయందుఁ గాన్పింపదు. ఉపేక్షింపఁబడినగడ్డము; అదియును నీకులేదు. అయినను గనిష్ఠసోదరుని దాయభాగమువలె నున్ననీగడ్డమునుగూర్చి మన్నించెదను. బిగియింపంబడని మేజోడును, ముడివేయఁబడని కుళ్లాయియును, బంధింపఁబడని పావరలును నీయాకారమెల్ల నుపేక్షాభావమువలన శిథిలమైనటులు గాన్పింపవలెను. కాని నీ వట్లులేవు. ఇట్టి నీవేషవైఖరింబట్టి చూడఁ జారుమతియందు నీవు వెల్లడించు ప్రేమాతిశయముకంటె నీయందలి ప్రేమయే నీకు గాఢమయిన దని నిరూఢముగాఁ దెలియుచున్నది.

భీమ—సుందరుఁడా! నాకుఁ గలప్రేమాతిశయమును నీవు విశ్వసించునట్లు నీకెఱింగింపలేమికి మిక్కిలి విచారించుచున్నాఁడను.

చారు— నన్నా నీవు నమ్మించునది! నన్నెంతత్వరలో నమ్మింపఁగలుగుదువో నీచారుమతిని గూడ నట్లే నమ్మింపఁగలుగుదువు. ఆమె నిన్నుఁ బ్రేమించియున్నయెడల నట్టిప్రేమను స్వాయముగా వెల్లడించుటకంటె నీప్రేమనం

కరించుటయే సులభము గావున నట్లు చేయునేమో ? స్త్రీలు తనయంతరాస్త్ర ప్రబోధించుసంశయమునకు భిన్నములుగా నాచరించులోపములలో నిదియొకటి. దీనికేమిగాని చారుమతిని మిక్కిలిగాఁ గొనియాడుచుఁ పరుగుల్తల తాఁకులయందు గీతముల వ్రేలఁగట్టినది నీవేనా ?

చు—ఓ యువకుఁడా! అట్టిదురదృష్టవంతుండ నేనేయని యాచారుమతి కెంజిగురుఁబోలు కెంగేలుతోడుగా నీకుఁ బ్రమాణముచేసి చెప్పుచున్నాను.

రు—నీగీతములయందుఁ గాన్పించునంతటి ప్రేమానుబంధము నీడెందంబునఁ గలదా?

చు—నాయనురాగగాంభీర్యము వర్ణనాతీతము.

రు—నిజముగాఁ బ్రేమయనునది యొకయున్మాదము. నహజోన్మాదులకుఁ బోలెఁ బ్రేమానుబద్ధులకును దామసాగారంబుల వేత్రశిక్షయే తగినచికిత్స. అయినను లోకమునందెల్లరును రాగోన్మత్తులై యుండుటవలన వీరికట్టిశిక్ష ధింప వలనుపడదయ్యె. ఏదియెట్లున్నను నట్టిశిక్షావిధానము లేకయే సులభసాధ్యం బగుసదుపాయంబున నీరుగ్ణత నివారించెద.

—నీవిదివఱ కెవ్వరికైన నట్టిప్రతిక్రియ నెఱవేర్చియుంటివా?

రు—ఒక్కని కీవిధమున నెఱవేర్చియుంటిని. నన్నుఁ దన ప్రేయసిగ భావించి నన్నాతఁ డనుదినము నుపసర్పించునటులు చేసితిని. దినదినంబును వృ క్షయంబుల మార్పుఁజెందు చంద్రునిఁబోలె ననుక్షణంబును భిన్నభిన్నములైన వృత్తిపరంపరలు గలవాఁడనగుటచే, నొకప్పుడు దుఃఖము నొకప్పుడు స్త్రీస్వభావము నొకప్పు డుత్కంఠయు నొకప్పుడు ప్రీతియు నొకప్పుడు గర్వము నొకప్పుడు చోద్యము నొకప్పుడు కపిస్వభావము నొకప్పుడు చేలతనంబు నొకప్పుడు చాంచల్యంబు నొకప్పు డశ్రుధారాపూరణంబు నొకప్పుడు చిఱునవ్వును, గనఁబఱిచితిని. ప్రతిరసంబున నించించుక సూచించితినిగాని పూర్ణముగాఁ బ్రకటింపనైతిని. ఇదియేగదా

స్త్రీలకును బాలురకును సహజస్వభావము. ఒకప్పు డనురాగంబు నొప్పుడు హేయతయు, నొకప్పు డాదరించుటయు, నొకప్పుడు బెదరింటయు, నొకప్పుడు వానికొఱకు కేడ్చుటయు, నొకప్పు డుమియుటయు నికృత్యములచే నన్నాశించియున్న వానికి మదనోన్మాదము నెడలించి సహజోన్మాదమును గలిగించితిని. అనఁగాఁ బ్రాపంచికజ్ఞానమును విడిపింయరణ్యమునఁ దపంబుఁ జేయు మునీశ్వరునిగా మార్చితిని. ఈవిధంబు వానికిం గుది తిని. అటులే నీకాలేయంబునం గలరాగకళంకమును నిషంబుగాఁ జే యాటవికహృదయంబుం బోలె శుభ్రపఱిచెదను.

భీమ — యువకుఁడా! ఈరోగనివారణమే నాకిష్టములేనిపని.

చారు — నీవు నాకుటీరంబున కేగుదెంచి నన్నుఁ జారుమతీ! యనిపిలుచు నన్ననుసరించిన నీకీవ్యాధిని నివర్తింపఁ జేసెదను.

భీమ — నాప్రియురాలియందలి విశ్వాసమున నట్లేచేసెదను. నీకుటీరమెక్క

చారు — నావెనువెంట రమ్ము కనఁబఱిచెదను. మనము పోవుదారిని నీనిం స్థలముగూడ నివరింతువు గాక! వచ్చెదవా?

భీమ — ఓయోగ్యుఁడా! మనస్ఫూర్తిగా వచ్చెదను.

చారు — ఆఁ! ఆఁ! చారుమతీ యనిపిలువుము. కమలా! పోవుదము రమ్ము

(అందఱు నిష్క్రమింతురు)

## 3-వ రంగము.

## అరణ్యము.

(విదూషకుఁడు మాద్రి ప్రవేశించుచున్నారు,
ప్రియంవదుఁడు రహస్యముగాఁ బ్రవేశించుచున్నాఁడు.)

విదూ — మాద్రీ! రమ్ము. వెనుకడుగు వేసెదవేమి? మాద్రీ! నీగొఱ్ఱెలను దోలుకొనివచ్చెదను. మాద్రీ! ఎట్లు? నీకుం బ్రేమాస్పదుఁడ నిం నే నేనా? నాముఖమువైఖరి నీకు నచ్చినదా?

ద్రి — తెనాలిపురవాసులలో రామలింగఁడున్నట్లు నాగొఱ్ఱెలయొద్దను నా యొద్దను వికటకవివై యుంటివి.

యం — అయ్యో! అపవిత్రస్థానమున నివసించిన యోజ్ఞానమా! తాటియాకులగుడిసెలో నున్నదయ్యముకంటె నీయవస్థ కడునీచముగా నున్నదిగదా!

ా — చింతకాయపచ్చడి మెతుకులు పెట్టి పూఁటకూళ్లమ్మ పదిరూపాయలు తెమ్మన్నప్పు డాతని కెట్లుండునో, యొకనిపద్యముల స్వారస్యమును వినువారు గుర్తింపనప్పుడును, నొకనిమాటయందలి రసమును బాగుపడఁదలఁచుకొనిన బుద్ధిమంతుఁడు గ్రహింపలేనప్పు డట్లే చచ్చిన బాగుగానుండును. నిశ్చయముగాఁ గవిత్వరసగ్రహణశక్తి నీకొసంగవలయు నని దేవతలఁ బ్రార్థించుచున్నాఁడను.

ద్రి — కవితాశక్తి యని చెప్పుచుంటివి. ఆశక్తి యేస్వరూపముగలదియో నాకుఁ దెలియకున్నది. అది మాటనిలుకడ గలదియు పనిదబ్బఱలేనిదియు నైనదేనా? నిర్మలమైనదేనా?

దూ — నిశ్చయముగా నట్లుగాదు. ఏలయన నిజమైన పద్యకావ్యము స్వకపోలికల్పిత మగుటచేఁ గేవల మసత్యము. కాముకులు, కవీశ్వరులై పరిణమించి తమపద్యములయందుఁ జేయుప్రమాణములను గాముకవృత్తియందు నటింతురు.

మాద్రి — అట్లులైన నన్నుఁగూడ దేవతలు కవినిగాఁ జేయవలయు నని కోరుచుంటివా?

దూ — నిశ్చయముగా నట్లే కోరుచుంటిని. ఏలయన, నీవు సత్యవంతురాల నని నాతోఁ బ్రమాణముచేసితివి. ఇపుడు నీవు కవివైనచోఁ గొంత నటనాశక్తి గలదాన వగుదు వనునాశ కలుగును.

ద్రి — నేను మర్యాదకలదానను గా నుండవలయు నని నీకులేదా ?

దూ — నీవు కురూపిణివైనఁ దప్ప నిశ్చయముగా నటులులేదు. ఏలయన,

మర్యాదతో సౌందర్యమును జతపఱిచినఁ జక్కెరలోఁ దేనెఁ గలిపినట్లగు.

ప్రియం — (తనలో) వీఁడు కొంచెము తెలివిగల నిర్భాగ్యుఁడే.

మాద్రి — నేనంత యంపకత్తెను గాను. కావున దేవతలు నాకు సుగుణస పత్తినే దయసేయుదురుగాక !

విదూ — నిజముగా మాణిక్యమునంటి మర్యాద నీయేబ్రాసితొత్తుపైఁ బడఁచిన ముటికిచిప్పలోనుంచిన మంచియామిషంబువలె శోభించును.

మాద్రి — నేనేబ్రాసినైనందుకు దేవతలకు గృతజ్ఞనై యుండవలసియున్న దొత్తునుమాత్రము కాను.

విదూ — బాగుగనే యున్నది. నీయేబ్రాసితనమునకు దేవతలు స్తుతింపఁబడురుగాక ! తొత్తుతన మింకముందు వచ్చుఁగాక ! అదియెట్లయిన నునిమ్ము. నిన్నుఁ బెండ్లిచేసికొందును. ఇందునకే బొరుగూరిపురోహితుఁడగుకొండుభట్టుగారియొద్దకుఁ బోయియుంటిని. ఈయరణ్యప్రదేశము తాను వచ్చి మననాలుగుచేతుల నేకముచేసెద నని వాగ్దానము చేసినాఁడు.

ప్రియం — (తనలో) ఈసమావేశము గాంచుటకు నేనుత్సాహపడుచుంటిని.

మాద్రి — దేవతలు మనకు సంతోష మొసంగుదురుగాక !

విదూ — తథాస్తు. ఎవఁడైనఁ బిఱికివాఁడైనయెడల నీప్రయత్నమున పాఱపోవును గదా ! ఏలయన, వృక్షములేకాని యాలయము లే కొమ్మలు దిరిగినమృగసంఘమే గాని బంధుసంఘములేదు. అయినను నే ధైర్య మవలంబింపవలయును. కొండుభట్టుగా రిటులే వచ్చుచున్నారు.

(కొండుభట్టు ప్రవేశించును

విదూ — అయ్యా ! కొండుభట్టుగారూ ! మీరు సమయమునకు దయచేసితి మీరు మాకార్యము నీచెట్టుక్రింద నెరవేర్చెదరా ! లేక మీతోఁగూ దేవాలయమునకు రమ్మందురా!

గొండు — ఇచ్చటను గన్యాదాత లెవ్వరనుతేరా ?

విదూ — ఎవ్వరయిన దానమిచ్చినయెడల నేను దీనిని బుచ్చుకొనను.

గొండు — నిశ్చయముగా నామె నెవ్వరయిన నీయవలసినదియే లేనియెడల వివాహము శాస్త్రోక్తము కానేరదు.

ప్రియం — (ముందుకువచ్చి) కానిండు కానిండు. ఆమెను నేనిచ్చెదను.

విదూ — దండములండీ! అయ్యా! మీపేరేమి? తమకు క్షేమమా? మీరు మమ్ము లను మిక్కిలి మంచిసమయమునఁ గలిసికొంటిరి. మనప్రథమసమాగమ మునకు దైవము లాభము గలుగఁజేయునుగాక! మిమ్ములఁ జూచినందుకు నాకుఁ జాలసంతోషముగా నున్నది. అయ్యా! ఇచ్చట నొకస్వల్పకార్యము జరుగుచున్నది. దయచేసి కుర్చీయిఁ బెట్టుకొనుఁడు.

ప్రియం — విదూషకుఁడా! నీవు పెండ్లిచేసికొందువా?

విదూ — అయ్యా! ఎద్దునకుఁ గాఁడివలెను, గుఱ్ఱమునకుఁ గళ్లెమువలెను, డేగకు మువ్వవలెను, మనుష్యునకుఁ గోరికలు కలవు. పావురములు ముక్కు ముక్కుఁ ర్చుకొనునట్లు వివాహము —

ప్రియం — నీవింత వి_ బుద్ధులు గలవాఁడ వయ్యు ముష్టివానివలె నీచెట్టు క్రిందనా పెండ్లి చే కొనుట! నీవెద్దియేని దేవాలయమున కేగి వివాహసమ యములఁ దెలుపఁజాలు పురోహితునిం జూచుకొమ్ము. ఈగొండుభట్టు కొట్టుబల్లలను గూర్చునట్లు మిమ్ములం గూర్చును. తరువాత మీలో నొకరు బింకముతప్పి తుదకుఁ బచ్చిబల్లలచేఁ జేయఁబడిన కొయ్యతలుపు లెండి యో సెల్లునట్లు పెడమొగములు పెట్టుకొని యెడఁబాటుఁ జెందెదరు.

విదూ — (ప్రియంవదు నపవారించి) నాకేమియు నిష్టములేదు గాని, అయినను వీనిచేతనే యీకార్యము నెఱవేర్చుకొనుట నాకుమంచిది. ఈతఁడు జరుప వలసిన తంతు యథావిధిగా జరుపనేరఁడు. అందువలన నవసరమువచ్చి నపుడు దీనిదిగనాడి పోవుట కవకాశముగా నుండును.

ప్రియం—నీవు నాతో వచ్చి నన్ను నీకుఁ దగిన సదుపాయముఁ జెప్పనిమ్ము.

విదూ—ఓప్రియురాలా! పోవుదమురమ్ము. కొండుభట్టుగారు! మీకు నమస్కారము. సెలవొసంగుఁడు.

గీ. ఉండబెల్లంబువంటి యోకొండుభట్ట!
మొండిధైర్యంబుగలు నోకొండుభట్ట!
పోకుపోకుము నను డి ముందునీవు
కాదు కా బట్టలు కట్టఁగట్టి
చంకఁబెట్టు పొమ్ము నేనింక నీకు
సెలవొసంగితి పొమ్ము నీచేత నేను
బెండిలి యొనర్చుకొననోయి కొండుభట్ట! 47

(విదూషకుఁడు, మాద్రి, ప్రియంవదుఁడు నిష్క్రమింతురు.)

కొండు—అయిననేమి లెమ్ము. చపలచిత్తులైన యీదుర్మార్గులందఱు నేకీభవించి నను నాయుద్యోగమును దీసివేయఁజాలరు.

(నిష్క్రమించును.)

## 4-వ రంగము.

### అరణ్యము.

(చారుమతీకమలలు ప్రవేశించుచున్నారు.)

చారు—నాతో నెన్నఁడును మాటలాడకుము. నాకు దుఃఖము కలుగును.

కమ—కంటఁ దడిపెట్టుటపౌరుషార్థము కాదని జ్ఞప్తికిం దెచ్చుకొనుమని వేఁడుకొనుచుంటిని.

చారు—నాదుఃఖమునకుఁ దగినకారణము లేదా ?

కమల—ఒకఁడు తమంచికారణము గావలయు నని కోరునో యంతయు గలదు. దుఃఖపడుము.

చారు — వానిశిరోజముల వర్ణమే వానివిశ్వాసహీనతను దెలియఁజేయుచున్నది.

కమ — వీనిశిరోజములు యూదాయనువానిశిరోజములకంటె నించుక ధూమ్ర వర్ణముంగల్గియున్నవి. దైవమా దాని ముద్దులుయూదాపిల్లలే.

చారు — నిశ్చయముగా వానిశిరోజములు మంచివర్ణము కలవి.

కమ — అవును మిక్కిలిమంచిరంగు. తామ్రవర్ణమునకు మించినరం గేదియులేదు.

చారు — ప్రభుభోజనమందలి రొట్టెను దాఁకుట యెంతపవిత్రమో, దీనిముద్దు లంతపవిత్రమయినవి.

కమ — రతీదేవి ప్రాఁతవగుటచేఁ దీసివైచిన పెదవులనితండు కొని ధరియించు కొని యుండఁబోలు. మంచువలెఁ జల్లనైన పరివ్రాజికయొక్క ముద్దులకన్న మిగులఁ బవిత్రమైనవి. అట్లయిన నేఁటియుషఃకాలమునకే వచ్చెద నని సమయముచేసి యింత దనుకఁ దడయఁ గారణంబేమి ?

కమ — అట్లయిన నాతఁ డసత్యవంతుఁడే.

చారు — నీవట్లే యనుకొనెదవా ?

కమ — అవును. పశ్యతోహరుండును, జదాంగయుఁ గాఁడుగాని యనురాగ విషయమున నాతఁడు కడిగిబోర్లించిన బూరెలమూకుడుతోను బురుగుదొలి చినబాదముకాయ డను బోల్పఁదగినవాఁడు.

చారు — అనురాగవిషయమున నాతఁడు విశ్వసనీయుఁడు కాఁడందువా?

కమ — హృదయమునఁ గలిగినయెడల విశ్వసనీయుఁడే. అట్లు కలుగలేదనియే నానమ్మకము.

చారు — తాను దృఢముగాఁ బ్రేమించితినని ప్రమాణముఁ జేయుట నీవు విని యేయుంటి గదా!

కమ — "ప్రేమించితి" ననునది "ప్రేమించుచున్నా" నని యెట్లగును? ఇంతి యేగాక, కాముకుఁ డొనర్చుప్రమాణములు మద్యము నమ్మువానిమాటల

వంటివి. వీరిద్దఱును దప్పుడులెక్కలను స్థిరపఱుచుచుందురు. అతఁడు నీతండ్రియైన భూపాలుని కీయరణ్యమునందే సన్నిధానవర్తియై యుండెను.

చారు—నిన్నఁటిదినంబున నేను మాతండ్రిం గలిసికొని చాలతడవు ముచ్చటించితిని. ఆయన నీతలిదండ్రు లెవ్వరని ప్రశ్నించెను. మీయంతటివారే యని సమాధానము చెప్పితిని. పిమ్మట హాసన్ముఖుఁడై నాకు సెలవొసంగెను. భీమబలునంతటివాఁడు గలిగియుండఁ దలిదండ్రులప్రస్తావన యేల?

కమ—ఆహా! అతఁడు మిగుల ధైర్యశాలి. మిక్కిలి గంభీరము లగు గీతములు వ్రాయును. సాహసోక్తులు పలుకుచుండును. దృఢమయిన శపథములతోఁ బ్రమాణము చేయును. దృఢముగా భంగపఱుచును. బహుకుశలుఁడు, తనప్రేయసి హృదయమును వికలపఱుచును. జేలడేగవలెఁ గుంఖేలనంబున నొక్కములుగాలఁ దనగుఱ్ఱమును దన్ని వక్రమార్గమున నపించి భగ్నభల్లుఁడయిన యశ్వసాదివంటివాఁడు. కాని యౌవనమశ్లించి యజ్ఞానము మార్గదర్శిగా నున్నపుడు సర్వమును సత్యమయి కాన్పించునుగదా! ఎవఁ డావచ్చునాఁడు?

అంగదుఁడు — (ప్రవేశించి) యజమానురాలా! నాఁడు పచ్చికబయట నాతోఁ గూర్చుండిన గర్విష్ఠురాలు దురహంకారిణి యు నగుప్రేయసిం గొనియాడుచు నది తన్నుఁ బ్రేమింపమికి నిందించుచు నుండిన గొల్లవానిం గూర్చి మీరు తెలుచు ప్రశ్నించుచుందురు.

కమ —వాని ప్రచార మేమి?

అంగ—గాఢానురాగముయొక్క వెలవెలఁబోవుపాండురవర్ణంబునకును, గర్వాహంకారతిరస్కారములయొక్క దేదీప్యమాన మగురక్తవర్ణంబునకును, గతారతమ్యముయొక్క చక్కని ప్రదర్శనముం జూడఁగోరితిరేని యిచ్చటనేయించుక దూరమునకు నాతోడ వచ్చితిరేనిఁ గాంచఁగలరు.

చారు—ఓహో! మనము పోవుదము రండు. కాముకులసందర్శన మితరకా

కుల కాహారమైయుండును. (అంగదు నుద్దేశించి) మమ్ము నచ్చటికిం గొని పొమ్ము. వారిప్రేమరంగమున నేనొకముఖ్యపాత్రము నైతినని నీవు చెప్పుట కవకాశము గలిగించెదను.

(అందఱునిష్క్రమింతురు.)

## ౫-వ రంగము.

## అరణ్యములోని మఱియొకప్రదేశము.

(భద్రుఁడు, కలహాశీల ప్రవేశించుచున్నారు.)

భద్రుఁడు—నాముద్దుల కలహాశీలా! నన్నుఁదిరస్కరింపకుము. కలహాశీలా! అట్లు చేయవలదు. నేను నిన్నుఁ బ్రేమింపలేదని చెప్పుము. కాని యటులాగ్రహముతోఁ జెప్పకుము. నిరంతరము పలువురి కుత్తుకలఁ గోయుటచేఁ గఠినచిత్తుఁడయిన తలారి తొలుత క్షమాపణము చెప్పక వంచఁబడిన కుత్తుకపై కరవాలము నిడఁడు. నెత్తురుజీవనము సేయునాతలారికంటెను గ్రూరదృష్టితోఁ జూచెదవా?

(వెనుకనుండి చారుమతి, కమల, అంగదుఁడు ప్రవేశించుచున్నారు.)

కలహాశీల—నేను నీకుఁ దలారి నగుటకు నాకిష్టము లేదు. నీకు హానిచేయు తలంపు నాకు లేదు. కావునఁ దొలఁగియే తిరుగుచుందును. నాకంటి యందు హత్య కలదని చెప్పుచున్నావు.

గీ. నాకనులలోన మృ ‍ వున్న దని నీవు
పల్కెదవు నీదుమాట భావ్యంబుగాదు,
దక్షత యొకింతలేక మార్దవము గల్గి,
రేణువులకైన భీతిల్లి రెప్పలార్చు

కన్నులను, ద్రోహులనియును, గటికలనియును,
ఘాతుకులటంచుఁ జెప్పుట నీతియగునె. 47

మనస్ఫూర్తిగా నాక్రోధదృష్టులు నీపైఁ బ్రయోగించెదను. నాదృష్టులకు గాయముఁజేయు శక్తియే యున్నయెడల నిన్నుఁ బొడిచి చంపము, మూర్ఛ నటింపుము. ఇంకను గ్రిందఁబడవేమి? అట్లు పడలేకపోయితి వేని నానేత్రములు మృత్యుదాయకము లని పలికి యున్నాతమాడినందులకుఁ జీ చీ! సిగుపడుము. సిగ్గుపడుము. నాకన్నులు నీకచ్చట గాయములు చేసినవో నఁబఱుపుము. ఒకగుండుసూది పెట్టి గీఁచుకొన్న మచ్చపడును. తుంగపై నించుక యానుకొనిన నీయఱచేత క్షణకాలమైన నానవాలుండును. కాని నీపై నేను బ్రసరింపఁజేసిన దృష్టులు నీకు హానిచేయఁజాలకున్నవి. హానికరమైన సామర్థ్యము నాకన్నులకుఁ గల దని నేనునమ్మను.

భద్రుఁడు—ఓప్రియమైన కలహాశీలా! ఎన్నఁడైనను—అయినన్నఁడు త్వరలో సమీపించిన బాగుగనుండును. మోహాధికారమును మఱిశెడుయొకని ముఖము నందు నీవు కాంచినయెడలఁ దీక్ష్ణములైన మోహబాణములయొక్క యదృశ్యము లయిన గాయములను నీవు తెలిసికొనఁగలవు.

కలహా—అట్లయిన నం వఱకును నీవు నాచెంతకు రావలదు. ఆసమయము వచ్చినపుడు కరుణఁజూడక నీవెక్కిరింతలచే నన్ను బాధింపుము. అం వఱకు నిన్ను నేను గణింపను.

చారు—(పరిక్రమించి) ఏలొకో చెప్పుము. అదృష్టహీనుల నష్టమా యేకకాలమున సంతోషించుచుంటివి. ఇట్టి నీత యెవరు? నీవింక యందకత్తె వైననేమి?—

గీ. శయనగృహముల ఘనతమిస్రంపువేళ
నేగునప్పుడు కాంతివిహీన లౌట

